శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౪ { పార్థివ శ్రావణ-ఫాల్గునములు } సంచిక ౩-౬

## శ్రీనాథుఁడు—బంగారు మొలక.

చిందూరి ఈశ్వరదత్తు, బి. ఏ.

శ్రీనాథుఁడు హరవిలాసపీఠికలో నవచి తిప్పయ్య సోదరుని ద్వీపాంతర వాణిజ్య వర్ణనా సందర్భమున, జలనోంగినుండి యీతఁడు బంగారు మొలకను దెచ్చినట్లు వర్ణించెను.

సీ. పంజారఁ గప్పురపాదపంబులఁ దెచ్చె
జలనోంగి బంగారు మొలక దెచ్చె

ఈబంగారు మొలక కర్థము శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తాము నూతనముగా సంస్కరించి ప్రకటించిన హరవిలాసపీఠికలో గులాబిచెట్టని పన్నీరు మొలక యని సెలవిచ్చినారు. కాని వీరిచ్చిన యర్థము సరికాదని తలఁచుట కాధారములు గలవు. బంగారు మొలకనుగూర్చి ప్రశంసించిన మఱియొక సుప్రసిద్ధాంధ్రకవి గలఁడు. చెళ్లపిళ్ల సరసకవి యామినీపూర్ణతిలకావిలాసములో యామినీపూర్ణతిలక సౌందర్యమును వర్ణించుసందర్భమున నామెను బంగారు మొలకతోఁ బోల్చినాఁడు. ఆపద్యము నిం దుదాహరించెదను.

ఉ. కందని మోముపందు కసుగందని జాబిలినిగ్గు తేటము
క్కందనిపూలగుత్తి మరుగందని తళ్కుమెఱుంగుజిల్గు వా
గందని ముద్దుచిల్క తెఱఁ గందని బంగరుబొమ్మ పూలదా
గందని మారువాటి వెరగందని క్రొన్నెలజంకకూన నా
గందని తమ్మిమొగ్గ పులుగందని ముత్తెముసొమ్ము కొమ్మయున్

సీ. కళలు చేరెడు నిండు జిలుగువన్నెలగుత్తి
గమగమవలచు బంగారుబొలక
కొదమతుమ్మెద పాదుకొనని క్రొన్ననదండ
నడువనేర్చిన రతనంపుబొమ్మ
తళుకనిల్పు తొల్కరిమింటఁదీఁగ దె
మ్మెర చూరగొనని కమ్మపూఁదావి
తొడరి కోయిల సొంక మడుగని మెలమావి
వెలలేని జిలుగువన్నెలకోటారు

గీ. కాంత రతికాంత కాంతుఁ బూజింతు ననుచు
సంతసము నెంత సంతసల్ దొంతరిలఁగ
సంతరించిన వింతచామంతిబంతి
వంతుకెక్కిన వలరాజుదంతి యుంటి.

ద్వితీయాశ్వాసము, 70-71 ప.

పై పద్యములలోఁ గవి యాత్తనయుఁపూలోనున్న యామినీపూర్ణ తిలకను వర్ణించు రూపకాతిశయోక్త్యలంకారమును నిరూపించెను. గమగమవలచు బంగారుబొలక యనఁగాఁ దావి యబ్బిన బంగరు మని యర్థము.

ఈ బంగారుబొలక కర్థము బ్రౌణ్యనిఘంటువునఁ గలదు.

బొలక : ఈ పడుచు బంగారుబొలకవలె నున్నది. (She is a perfect beauty)

బ్రౌణ్యనిఘంటువు, పుట 818. 1852 సం ప్రకాశ్యము.

ఈ బంగారు మొలకలు ఆంగ్లమున నగ్గెట్ (Nugget) అని యర్థము. పూర్వకాలమున దక్షిణాపథమునుండి సార్థవాహులు సువర్ణ ద్వీపము (Java) నుండి, ఇట్టి బంగారు మొలకలను దెచ్చుచుండెడివారట. జలసోంగి యనునది ఇప్పుడు, జావా, సుమత్రా, బోర్నియో ద్వీపములలో నొక రేవుపట్టణమై యుండనోపు. పూర్వము బర్మాలోని కొంతభాగమునకు రామన్నదేశ మనియు, సువర్ణభూమి యనియుఁ బేర్లుండెను*

శ్రీనాథుఁడు తిక్కయ తరుణా, చీని, తవాయి, గోవ, రమణా స్థానంబులనుండి సామాగ్రి దెప్పించుచుండెనని చెప్పినాఁడు. కాఁబట్టి శ్రీనాథుఁడు వర్ణించిన బంగారు మొలక కర్థము గులాబీ దట్టని కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. గొజ్జంగినీ రనఁగాఁ బన్నీరు. గులాబీనీ రని యభిప్రాయపడి, సీసపద్యము మొదటిపాదములో కవి కర్పూరపాదక ములను దెచ్చినట్లు చెప్పుటచే బంగారు మొలక యనఁగాఁ బన్నీరు మొలకయై యుండునని ప్రభాకరశాస్త్రిగారు తలంచిరి. గొజ్జంగి పదమునకుఁ బూర్వనిఘంటువులలో గులాబీ యని యర్థము లేదు. కిట్టెలుదొర కన్నడనిఘంటువులలో గొజ్జఁగి పదమున కొకవిధమైన మల్లె లేక చామంతి యని యర్థము వ్రాసియున్నాఁడు. అట్లే మద్రాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన తమిళనిఘంటువునందుఁ గలదు.

గుజ్జెగె : గజ్జిగె; గుజ్జగె; గొజ్జగె A kind of Jasmine
సేవన్తిగె, తెలుగు, గుజరి, తమిళము కొజ్జంగిరి.

Kittel Dicionery.

ఈ విషయము శోధింపఁదగినది. మఱియొక వ్యాసమున నీ ప్రసంగమును జేసెదను.

---

Now, we have definite evidence that a porsion of Burma was known in latter ages as Suvarnabhumi. According to Kalyani inscriptions(1476 A.D), Ramaunadesa was also called Suvarnabhumi.
Suvanadvipa Vol II. Page 46.

అవచి తిప్పయ 'చీని, సింహళ, తవాయి, హురుమంజి, జోణంగి ప్రభృతి నానాద్వీపనగరాదులకు ధనకనకవస్తువాహనమాణిక్య గాణిక్యములను దెప్పించి యిప్పించువాఁడఁట. ఈజోణంగిదేశ మిప్పటి తురుష్క (Turkey) పారశీక (Persia) దేశ భూభాగము. ఆనాఁటి వణిజులు పూర్వ పశ్చిమదేశములలో వాణిజ్యము సాగించు చుండినటుల శ్రీనాథుఁడు స్పష్టపఱచినాఁడు. కిట్టెల్ నిఘంటువులో జోణంగి పదమున కర్థ మిట్లు కలదు.

జోనంగ—Tbh of యవన, An Ionian, a sunk, An Arab
(తురక, తురుష్క—యవన Mr. 382. తెలుఁగు జోణంగి తమిళ మలయాళము జోనక, జోనకన్—A Turkish Arab)

జోణంగిదేశ మనఁగా నిప్పటి యరేబియా, టర్కీప్రాంతభూమి యని నిశ్చయము కాఁగలదు. ప్రభాకరశాస్త్రిగారభిప్రాయపడినట్లు మలబారుప్రాంతవిషయము కాదనవచ్చును.



శ్రీః

# కుమారసంభవ విమర్శనము.

విద్వాన్ శ్రీ భక్తవత్సలము, బి. ఏ

---

## I

కుమారసంభవ మనుపేర నిప్పుడు మనకు లభ్యమై యుండు నది పదునేడు సర్గల గ్రంథము. తారకాసురసంహారము నందు కథ గలదు. ఇదే కాకయుఁ దొలుత దానికి సర్గ లిరువదిరెం డనియు, నేకారణముననో కడపటి యెనిమిది సర్గలు నష్టములై పోఁగా మిగిలినవే పదునేడు ననియుఁ జెప్పుచున్నారు. ఇందుం గూర్చి పలువురు పాశ్చాత్యులు యభిప్రాయమే మనఁగా పార్వతీపరమేశ్వరుల పెండ్లి దనుక నుండు నెనిమిదిసర్గల గ్రంథభాగమే కాళిదాసు వ్రాసినట్టి దనియు, తరువాతి సర్గలు నెవరో వ్రాసి కాళిదాసు గ్రంథముతోఁ జేర్పఁగా నవి యతనిపేర వ్యాప్తికి వచ్చిన వనియు.

పెండ్లితోనే కథ ముగియు నేని యీకావ్యము గ్రంథమునకుం బార్వతీపరిణయ మనియో గిరిజాకల్యాణ మనియో పేరు పెట్టవలయునే కాని కుమారసంభవ మను నామ మెట్లు సరిపడును? కాళిదాసు తగినపేరు పెట్టనేరని వాఁడా? మహాకవులగువారి రచనలలోఁ బ్రత్యక్షరమును భావగర్భమును నర్థపూర్ణమునై యుండునే కాని వ్యర్థమై యుండదే? ఇతఁడు గ్రంథమున కతఁడు పెట్టినపేరే తగక యుండునా? ప్రమాణబుద్ధితో మహాకవిహృదయము నారయుదుమేని ఆతఁడుంచిన కుమారసంభవ మను పేరే గ్రంథమునకుఁ దగిన దనియు, మఱియెవరు పెట్టు నేపేరును అంత యనురూపము గా దనియుఁ దెలిసికొనఁగలవార మగుదుము. మహాకవియగు నెవని రచనయందుఁ గాని యొక్కపదమందొలఁగించితిమేని యందులకు పదాంతరమును మనము

పూర్వభాగమందే యుండఁగా, నీక మహాకవికులగురు వగు కాళిదాసు వాడిన మాటను దొలఁగఁజేసి భయాంతరము కాదుగదా, అన్యార్థాంతరము నేని యూహించి పట్టి పూర్వఁగలవాఁ డెం దుండును?

రాక్షసబాధితు లగు దేవతలు కోరు ప్రయోజనము కుమారస్వామి పుట్టుట అదే కుమారసంభవము (II 51-2) ఆప్రయోజనము సిద్ధించుట కుపాయము ఉమామహేశ్వరుల వివాహము ఘటిల్లఁజేయుటయే యని బ్రహ్మ యుపదేశించెను. (II 57-61) మన్మథుం బూన్చి (III) దేవతలు కావించిన యత్నము కొనసాగకపోయినను వివాహ మెట్లో పార్వతీతపఃఫలముగా జరిగియే తీరును. (V, VI, VII). కుమారసంభవమునకు అద్వితీయోపాయముగా నుపదేశింపఁబడిన వివాహము నెఱవేఱుటయే కథకు ముగింపు. ఉపాయ మెట్లో ఘటమైనందునం దన్నిర్వర్తనము చేతనే వ్యంజితమైన ఫలసిద్ధిని మరల వాచ్యముగఁ 'కుమారుఁడు గల్గె' నని చెప్పుట చప్పగా నుండును. కావుననే వ్యంగ్యకవనమునం జేరిన్నికఁగన్న కాళిదాసమహాకవి యట్లు చెప్పఁడాయెను. 'కుమారసంభవము'నకు 'గిరిజాకల్యాణ'మను పేర నొసరిన యాంధ్రగద్యానువాదగ్రంథమునకుఁ బీఠిక వ్రాయుచు శ్రీయుతులు ఒంగోలు వేంకటరంగయ్య B. A., B. L. గా రిట్లు వ్రాయుచున్నారు:

The theme of this composition as conceived by the great master-poet starts from a combined request of all the Devas addressed to Brahma, the Creator, for a leader and commander of the angelic forces to war against and destroy the Titan Tarakasura and his hosts. The artistic consummation of the conception of such a plot may well be achieved and perfected by the wedding of the Divine Pair, the world-parents, Parvati and Parameswara and need not go down to the narration of the physical embodiment of the Devine Spirit into a son." సిద్ధించిన దని చెప్పుటతో సర్క అశేకయే సిద్ధించిన ప్రయోజనము కుమారసంభవము ప్రధానము కాఁగా తత్సాధకోపాయమగు వివాహమునకుఁ ప్రాధాన్యము లేదు. ప్రధాన మేదో దానినే కాళిదాసు గ్రంథమునకు పేరుచేసెను. పూర్వోక్తానువాదగ్రంథమునఁ గడపటి

వాక్య మిది. "కొంతకాలమునకు గౌరీశంకరులకుఁ గుమారుఁడు జన్మించి తారకుని వధించి విశ్వకళ్యాణసంధాయి యయ్యె" కుమారసంభవము నిట్లు వాచ్యముగఁ జెప్పియు నపవాదకులు ఆపేరు నేల తొలంగించిరో! మెఱుఁగు అనురూప్యంబుననే కాని క్రొత్తందనమునఁ గాదుగదా!

II

రక్షకునికొఱకైన లోకుల తహతహ నిరూఢమగుటకు సాధనముగాఁ గాళిదాసు తారకాసురుని దురధికారప్రాభవమును వర్ణించిన తెలుఁగు వర్ణనీయము. (a) అతఁడు ఋతులపొత్తు నపహరించెను. మేరు శృంగముల నాశ్మాలయములఁ గ్రీడాశైలములుగా నంతరించుకొనెను. మిన్నేటిపసిఁడితామరల నూడఁబెఱికి తనదిగ్గజములలోఁ బాదుకొల్పికొనెను. విమానమార్గముల నొరులం దలచూపనీయక వానిని తనసంచారమునకే యుంచుకొనెను. దేవతల హవిర్భాగముల నడిసి తీసికొనెను. ఇంద్రుని యుచ్చైశ్శ్రవమును హరించెను. రత్నాకరముల రత్నముల నన్నిటిని నాఁచికొనెను. పుష్కలావర్తకాది మేఘములం దన దంతావళముల వప్రక్రీడకు లోఁబఱచెను. (b) తనకు లేని కల్పవృక్షములు దేవతల కేలయని వానిని తెగనఱికించెను. (c) లోకక్షేమమునకై పాటుపడు సూర్యచంద్రవాయ్వాదులం దనసేవకే కట్టువఱచెను. తన తోఁటల కమలములను వికసింపఁజేయుటయే సూర్యునకును, తన నిశాలికాగారములకు వెన్నెలం గూర్చుటయే చంద్రునకును, తనకు పుష్పములం జేర్చిపెట్టుటయే ఋతువులకును, తనకుఁ జామరములు వీచుటయే అచ్చరలకును వారి శిరోరత్నముల వెలుఁగునం దననగరము ప్రకాశింపఁజేయుటయే వాసుకి ప్రముఖసర్పరాజులకును- పనులుగాఁ గల్పించెను. (d) లోకములం దాటుపోటు గావించెను. సూర్యున కెండకాలమున సైతము వేఁడిమి లేకుండునట్లును, వెన్నెలకు పెరుగుట, తరుగుటలు లేకుండునట్లును, వాయువునకు విశృంఖలసంచారము మాడుగునట్లును, ఋతువులకుం గ్రమప్రాప్తిలేక ఎండ వాన చలి మున్నగు ధర్మములు దప్పునట్లును

చేసెను. తారకాసురుని దురధికారంపుం బ్రాభవము సహింప నెవరికిని సాధ్యపడదయ్యెను. కానుకలు వెట్టి సుముఖుం జేసికొందమా యన్న, దుర్జనుఁ డగుటచే నతఁడు ప్రత్యుపకారముచే నణఁగునే కాని ఉపకారములకు లొంగఁడు. పోరి జయింతమా యన్న విష్ణువునంతటి దేవునకుం గూడ నది యసాధ్యమాయెను. కావుననే కుమారస్వామి యవతరింప వలసివచ్చెను. అదే ఏతత్ కావ్యప్రతిపాద్యప్రయోజనము.

తారకాసురసంహారసమర్థుఁడగు చమూపతి నొకనిఁ బ్రసాదింపుమని దేవతలు బ్రహ్మదేవుం బ్రార్థింప నావేల్పుఁ బెద్ద యుమాశంకరుల కుమారుఁడే యట్టిఁ డగునని, యుమాసౌందర్య విలాసుని చిత్తము నాకర్షించునట్లు చేయుటయే వారి వివాహమును ఘటిల్లఁ జేయు నుపాయమనియు నుపదేశించెను. ఆ యుపాయము సాహాయ్యమగుటకు హేతువైన యందలి లోప మేమనఁగా, ఈశుం డుమాశరంగూర్చిన విస్మృతి. ఇక బ్రహ్మదేవునకే క్రమ్మరన నింక దేవతలితరు లందుకు లోనగుటలో వింతలేదు. దేవతలు మన్మథుం బూన్చిరి. మన్మథోద్యోగము

(సశేషము)

# దర్శనసమీక్ష.

సాహిత్యశిరోమణి, భాషాప్రవీణ.
చిలుకూరి వీరభద్రశాస్త్రి

(అనువృత్తము.)

## నకులీశపాశుపతదర్శనము.

ఈ దర్శనమున నీశ్వరుఁడే జీవులసంసారమును దొలఁగించుటకయి కార్య, కారణ, యోగ, విధి, దుఃఖాంతము లనియైదు తత్త్వములు ప్రతిపాదింపఁబడినవి. పశు, పశుపతిశబ్దము లీక్రిందిరీతి నభియుక్తులచే నిర్వచింపఁబడినవి.

శ్లో. బ్రహ్మాద్యాస్స్తంబపర్యంతాః పశవః పరికీర్తితాః.
తేషాంహి నాయకో యస్మాచ్ఛివః పశుపతిః స్మృతః.

పశువులు జీవులు. పశుపతి యీశ్వరుఁడు. చేతనాచేతనరూప మగు ప్రపంచమునఁ గల పదార్థజాత మంతయు కార్యము. ఈశ్వరుఁడు కారణము. ఇతఁడు స్వతంత్రుఁడు. జపము, ధ్యానము, మొదలగునవి యోగము. మూఁడుకాలములయందు స్నానము, భస్మస్నానము మొదలగునది వ్రతము. పాశముల వీడి యీశ్వరుఁ డగుటయే దుఃఖాంతము. వీరిమతమున మోక్ష మీదుఃఖాంతమే. ఈ పంచతత్త్వాత్మక మగు పాశుపతతంత్రమువలననే ముక్తి కలుగు నని వీరినమ్మిక. కావుననే—

శ్లో. జ్ఞానమాత్రే వృథాశాస్త్రం సాక్షాద్దృష్టిస్తు దుర్లభా,
పంచార్థాదన్యతో నాస్తి యథావత్తత్త్వనిశ్చయః.

అని యభియుక్తవాక్యము.

---

## శైవదర్శనము.

కర్మాదినిరపేక్షుఁ డీశ్వరుఁడు కారణ మయినచో వైషమ్యము నైర్ఘృణ్యము ననెడి దోషము లీశ్వరునకుఁ దటస్థించును. అని యీమత

ము వారు ఈశ్వరుఁడు కర్మసాపేక్షుఁ డయి కారణ మగు నని యంగీక రించుటయేకాక తత్త్వములనొండురీతి గా నంగీకరించిరి. ౧ పతి. ౨ విద్య. ౩ అవిద్య. ౪ పశువు. ౫ పాశము. ౬ కారణము. వానిలో పతి శివుఁడు. తత్త్వజ్ఞానము విద్య. విద్యాజ్ఞానము అవిద్య. అసుచిత్వము మలము. మాయారోధము, కర్మ శక్తి, యను భేదములతోఁ గూడినది పాశము. (జీవబంధము.) శివుఁడు పశువు. పాశనివృత్తికయి జపధ్యానాచరణము కారణము.

శ్లో. పతివిద్యే తథా విద్యా పశుః పాశశ్చ కారణం,
తన్నివృత్తావితి ప్రోక్తాః పదార్థాః షట్ సమాసతః.

ఈతత్త్వములను యోగ్యముగాఁ దెలియుటవలనఁ బాశవిమో చన మగును. దానిచే నీశ్వరత్వము పొందుట రూపమయిన మోక్షము లభించు నని యీదర్శనకారులసిద్ధాంతసంక్షేపము.

---

ప్రత్యభిజ్ఞాదర్శనము.

ఈ మతావలంబులు మాహేశ్వరులు. వీరు మోక్షప్రాప్తికై ప్రత్యభిజ్ఞయే (అతఁడేనేను, వాఁడే వీఁడు, అదే యిది యని తెలియుట) ప్రధాన మగుసాధన మని యందురు. ఈశ్వరుఁడు పూర్ణుఁడు, స్వతంత్రుఁడు. కావున జగత్తును నిర్మించుటకయి కర్మాదిసాధనమును దేని నపేక్షింపఁడు. తన యిచ్ఛచేతనే యంతయు నిర్మించును.

చైతన్యము జీవేశ్వరులకు సహజము. కావున జీవులు పరస్పరము భిన్ను లయినను నీశ్వరునికంటె భిన్నులు కానేరరు. పరమేశ్వరునిలో జీవతాదాత్మ్య మనుభవసిద్ధము. కావున జీవులచే నీశ్వరునితోఁ దాదాత్మ్యమును బొందుటకై ప్రత్యభిజ్ఞ యాశ్రయింపనగును.

ప్రత్యభిజ్ఞ యన 'నేను ఈశ్వరుఁడను. ఈశ్వరునికంటె భిన్నుఁడను గాను.' అను సాక్షాత్కారము. కేవల మట్టి సాక్షాత్కారము చేతనే శ్రేయస్సు, మోక్షముఁ గూడ లభించును. మోక్షమునకయి

ప్రాణాయామాదులయపేక్ష వీరిమతమున లేదు. శరీరము నెండింపఁ జేయుట, భస్మస్నానము, జపము, హరిచర్య చేయుట మోక్షమున కనవసరము.

ఈశ్వరునివలెనే జీవుఁడు చైతన్యస్వరూపుఁడయినను మాయావశుఁడగుటచే నీశ్వరాంశుఁడై భాసించుటలేదు. ఈశ్వరునివలె పరిపూర్ణ చైతన్య స్వరూపుఁడై భాసించుటకుఁ బ్రత్యభిజ్ఞ యత్యంతాపేక్షితము. ప్రత్యభిజ్ఞాబలముచే "పూర్ణచైతన్యాత్మకత్వమే మోక్షము" అని ప్రత్యభిజ్ఞాదర్శనకారులభిప్రాయము. ఈవిషయమై పెద్దల యూహ యా క్రిందిరీతిది—

శ్లో. కైస్తై రప్యుపయాచితై రుపనత స్తన్వ్యాః స్థితోఽప్యంతికే
కాంతో లోకసమాన ఏవ మపరిజ్ఞాతో న రంతుం యథా,
లోకస్యైవ తథాఽనపేక్షితగుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
నైవాయం నిజవైభవాయ తదియం తత్ప్రత్యభిజ్ఞోదితా.

---

## రసేశ్వరదర్శనము

పారదము (పాదరసము) మున్నగు శబ్దములచే వ్యవహరింపఁబడు నేరసము కలదో యారూపుఁడగు నీశ్వరుఁడు రసేశ్వరుఁడు. ఈరసేశ్వరుఁడు శరీరమునకు దృఢత (బలము) నొసంగి ముక్తికి హేతువగు నని తలంచు మహేశ్వరులు రసేశ్వరులనఁబడుదురు. వారలచే రచింపఁబడిన దర్శనము రసేశ్వరదర్శనము.

వీరిమతమునను జీవాత్మలు చైతన్యస్వరూపులగుటచే నీశ్వరస్వరూపులే. పాదరసమును సేవించి దానివలన నగుశరీరదార్ఢ్యముచే నీశ్వరత్వప్రాప్తిరూప మగుజీవన్ముక్తిఁ బొందుదురు. ఆజీవన్ముక్తినే మోక్షముగ నంగీకరింతురు. జీవించియుండఁగా నగుముక్తి జీవన్ముక్తి. ముక్తియన మూలాజ్ఞానము నశించుటచేత నగునిజస్వరూపావాప్తి. అది జ్ఞానముచే సాధింపవలయును. 'తమేవ విదిత్వా' అని శ్రుతి. ఆత్మతత్త్వవిషయమగు

తెలిసెడిజ్ఞానము. 'తత్త్వమసి,' మొదలగువాక్యములవలనఁ గలుగు జ్ఞానమే మోక్షసాధనము. ఆజ్ఞాన మభ్యాసాతిశయమువలన లభించును. అభ్యాసము చేయవలయు నన్నచో శరీరబల మత్యంతావశ్యకము.

శ్లో. ఇతి ధనశరీరభోగాన్ మత్వాఽనిత్యాన్ సదైవ యతనీయమ్,
ముక్తౌ సాచ జ్ఞానాత్ తచ్చాభ్యాసాత్ సచ స్థిరే దేహే.

శరీరస్థైర్యము పారదాదిశబ్దవాచ్య మహారససేవనముచే లభించును. అట్టిరసమునకు పారద మను పేరు 'పారం దదాతి పారదః, అను వ్యుత్పత్తిచే సంసారము యొక్క యవ్వలియొడ్డును బొందించుటచేఁ గలిగినది. దీనివిషయమునఁ బెద్దలు —

శ్లో. సంసారస్య పరం పారం దత్తేఽసౌ పారదః స్మృతః
పారదో గదితో యస్మాత్పరార్థం సాధకోత్తమైః.

అని చెప్పిరి. ఈ పారదరసము సాక్షాత్తు మోక్షము నొసంగఁజాల దనియు మోక్షసాధనాభ్యాసమునకుఁ గావలసినశరీరపాటవము నొసంగి మోక్ష మియ్యఁగల దని వీరియాశయము.

కావున జీవన్ముక్తి కోరు ప్రతిమానవుఁడు మొట్టమొదట పారదరసమును సేవించి శరీరపుష్టిని సంపాదింపవలయును. అనంతర మాత్మతత్త్వ మభ్యసింపవలయును. ఆయభ్యాసమువలన మిథ్యాజ్ఞానము సమూలముగ నశింప జీవన్ముక్తి యగు నందురు.

ఇతరదర్శనకర్తలు శ్రవణము, మననము, నిదిధ్యాసనము, మున్నగుసాధనములచే జీవన్ముక్తి యగు నందురు వీర లంగీకరించిన రీతిని జీవన్ముక్తి నొప్పుకొనరు. మఱియు "శ్రు. తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే; శ్లో. పద్దవ్యోఽపి ముక్తిస్తు దర్శితా పిండపాతనే, కరామలకవత్సాపి ప్రత్యక్షా నోపలభ్యతే" అని శ్రుతిస్మృతులందు దేహపాతానంతరమే ముక్తి చూపఁబడినది. ఈశరీరదృశ్యమానమగు దేహ మాఱుకోశముల (ధాతువుల)చే నిర్మిత మని ప్రసిద్ధము. వానిలో చర్మము, రక్తము మాంసము, అను మూఁడు కోశములు తల్లి

శరీరము వలన వచ్చునవి. మేదస్సు, ఎముకలు, మజ్జ యనెడిమూఁడు కోశములు తండ్రివలనఁ బొందఁబడును. ఇట్టియాఱు కోశముల వలన నిర్మింపఁబడినయీశరీరము నాశమునొందుట యెల్లరకుఁ బ్రత్యక్షము. అట్టినను మనుమన శిథించియుండఁగా జీవన్ముక్తి (శాశ్వతకైవల్యము) కాంచుట యెట్లును బొసఁగ దని యందురు.

కాని తల్లిదండ్రులవలన నగు షాట్కౌశికదేహమున కస్థిరత (నాశము) అగుఁగాక. పారద, అభ్రక పదములచే వ్యవహరింపఁబడు హర గౌరీసృష్టివలన నయినశరీరము నిత్యము (అనపాయము.) అందు హర సృష్టి పారదము గౌరీసృష్టి, అభ్రకము. ఇట్లీవిషయము ప్రతిపాదితము-

శ్లో. అభ్రకస్తవ బీజంతు మమ బీజంతు పారదః

ఈశ్వరుని శరీరమువలనఁ గలిగినదగుటచేఁ బాదరసమునకు 'రసే శ్వర' మనెడిపేరు. ఇట్టిరసేశ్వరమును (పారదమును) సేవించుటచే దాని సంపర్కము వలన ననపాయమగుశరీరము లభించు. షాట్కౌశికదేహముఁ గూడ ననపాయి యగుచుండును. మఱియు నీషాట్కౌశిక దేహము గౌరీసృష్టివలన నగుశరీరసంపర్కముచే దివ్యము, దృఢతరము, కూడ నగును. లోహము పారదభేద మగుకరసవేధిసంబంధమువలన సువర్ణ మగుట యనుభూతము. రసార్ణవమున నీవిషయ మిట్లుచర్చింపఁబడినది.

శ్లో. యేచాత్యక్తశరీరా హరగౌరీసృష్టిజాం తనుం ప్రాప్తాః
ముక్తాస్తే రససిద్ధాః మంత్రగణః కింకరో యేషాం.

అట్టిమహాజనులకు జీవించియుండఁగనే ముక్తియగుటలో విప్రతిపత్తి యేమియు లేదని వీరి రాద్ధాంతము.

కావున దర్శనకారులచే నంగీకరింపఁబడిన జీవన్ముక్తి కరతలామలకమువలె రసేశ్వరసేవనముచేఁ బ్రత్యక్షమగుటలో సందేహమేమియు లేదు. జీవన్ముక్తియే లేదను రామానుజాదు లశాస్త్రజ్ఞు లని వీరియభిప్రాయము.

శ్లో. ఏకస్స్యాత్ ప్రకరణాని మోచనధియాం పాథ్యః ప్రకృత్యా పునః
సంపన్నః సహ తేన దీవ్యతి పరం వైశ్వానరే జాగ్రతి
జ్ఞాతో యద్యపరం నవేదయతి చ స్వస్వాత్మ్యత్వయం ద్యోతతే
సోఽయం బిభ్రత్స్వవ ద్వైతసంస్కృతిధరయా త్వారూఢా దశా పారదః.

ఈవిధముగ రసమునకుఁ బరబ్రహ్మ సామ్యాంగీకారమునకు 'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి, అను యూర్ధ్వప్రమాణమగు శ్రుతి యున్న దని వీఁగర్జనము.

---

పాణినిదర్శనము.

పాణినిచే రచింపఁబడిన సూత్రములు, వానిననుసరించి రచించిన వార్త్తికములు, భాష్యమునుఁ గలసి 'పాణిని దర్శన' మనఁబడును'

వీరలు జగత్తునంతకుఁ గారణముగ నద్వైతులు బ్రహ్మము నొకఁ జేతత్త్వముగ నంగీకరించినట్లు 'స్ఫోట' యను పేరుగల, నిరవయము, నిత్యము నగు 'శబ్ద'మను తత్త్వము నంగీకరింతురు దానినే బ్రహ్మ మందురు. వాచకమగు స్ఫోటశబ్దమునకు వాచ్యమగు బ్రహ్మకు నభేదమగుటచే 'స్ఫోట' యే శబ్దబ్రహ్మ మగుటకు సందియము లేదందురు.

మఱియు శబ్దములన్నియు నర్థము చెప్పునపుడు నాయాయి సత్తలను (స్థితులు) జెప్పినను నాయాసత్త యంతయు బ్రహ్మసత్త యగుటచే బ్రహ్మమే యన్నిశబ్దముల కర్థమయి యుండును. కావుననే శబ్దము నుచ్చరించినను బరబ్రహ్మోపాసనవలనఁ గలుగు ఫలితము (పుణ్యము) లభించును. 'యోఽర్థస్స శబ్దః యశ్శబ్దస్సోఽర్థః, యను తాదాత్మ్యము వీరికభిమతముగదా. ఇట్టి శబ్దతత్త్వోపాసన శుద్ధముగాఁ జేసిన బ్రహ్మము నొందుటయందు సందియము లేదని వీరలయభిప్రాయము. స్మృతి. శ్రుతి.

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి".

"ఏకశ్శబ్దః ... ... కామధుగ్భవతి ... ... అని. జీవుఁ డనియు నీశ్వరుఁడనియు భేదము లేనియద్వయతత్త్వమునకు భేద మెట్టులు కల్పిత

మీా దోటులనే వాచకమనియు, వాచ్యమనియు, వానికి సంబంధమనియు, నిదియంతయుఁ గల్పితమే. కావున నట్టి స్ఫోట బ్రహ్మమునకుఁ గలవాస్తవికైక్యము గాంచుచోఁ బ్రత్యగభిన్నము, స్వయంజ్యోతీరూపము నగు బ్రహ్మ మభివ్యక్త మగును. అద్వైదియే మోక్షము. స్ఫోటరూపమగు నీబ్రహ్మమునందు రజ్జువునందు సర్పమువలె నీప్రపంచ మంతయు వివర్త భావము నొందును. కావుననే యాద్యసృష్టియంతయు శబ్దరూప మయి నది. ఈవిషయమును శ్రుతిస్మృతులైకకంఠ్యముతో నిట్లు నుడివినవి.

శ్రు. "ఋఙ్మయో యజుర్మయః సామమయో వైరాజః పురుషోవై యజ్ఞః తస్యైతా లోకం కృణ్వాస్త్రిధ ఆహుతయ స్తావై త్రయో లోకాః"

శ్రు. "ఏష వై ఛందస్యః సామమయః ప్రథమో వైరాజః పురుషో యోఽన్న మసృజత, తస్మాత్పశవో ఽజాయంత. పశుభ్యో వనస్పతయో వనస్పతిభ్యో దిశః"

శ్రు. విష్ణేన విశ్వా భువనాని జజ్ఞే తాని ఇత్సర్వ మమృతం యచ్చమర్త్యం." అని

స్మృ. సూత్రభాష్యమున "శబ్ద ఇతిచేన్నాతః" అనుసూత్రముచే శబ్దపూర్వకముగ సృష్టి చెప్పఁబడినది. దీనిని నాచార్యులవా రిట్లు నిర్ణయించి యున్నారు. "కథంపున రవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి ?" "ప్రత్యక్షానుమానాభ్యాం" ప్రత్యక్షం శ్రుతిః ప్రామాణ్యం ప్రత్యనపేక్షత్వాత్, అనుమానం స్మృతిః, ప్రామాణ్యం ప్రతి సాపేక్షత్వాత్.

శ్రుతి. "సమనసా వాచా మిథునం సమభవత్."

స్మృతి. అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః
నామరూపం చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః

షర్వేషాం తు సనామాని కర్మణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే.

అని పరబ్రహ్మము శుద్ధస్వరూప మయినచో యీస్ఫోటశబ్దము వ్యక్త మగుపరబ్రహ్మస్వరూపముగా నుండును. ఎప్పుడు పరబ్రహ్మమునకు శక్తితో సంబంధము కలుగునో యప్పు డాఘాతము (దెబ్బ) కలుగుటచే సూక్ష్మత్వం కలుగ స్ఫోటశబ్దము వ్యక్త మగును. దానినుండి 'బహుస్యాం ప్రజాయేయ' అను ప్రాథమికేచ్ఛారూప మగు కార్యము జనించును. ఆ యిచ్ఛానంతర మనేకము లగు పదార్థము లుత్పన్నము లగును. పదార్థము లన్నియు నవిద్యాకల్పితము లగుటచే వాస్తవికము లు కానేరవు. కావున స్ఫోటరూప మగుపరబ్రహ్మనకాశమునుండి వివర్తరూపముగ మాయికమగు నిసర్గసృష్టి యగుటచే నాస్ఫోటబ్రహ్మమును శుద్ధముగఁ దెలియుటవలన మోక్షము కలుగునని వీరల నిశ్చయము. ఈవిషయమునకయి పెద్దల యభిప్రాయములు.

'అనాదినిధనం బ్రహ్మ...'
'స్వరూపజ్యోతిరేవాంతః సూక్ష్మా వాగనపాయినీ
తస్యాం దృష్టస్వరూపాయాం అధికారో నివర్తతే'
"ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయం సా మోక్షశాస్త్రాణా మజిహ్మా రాజపద్ధతిః
'అక్షరాణా మకారస్త్వం స్ఫోటస్త్వం వర్ణసంశ్రయః' అని.

స్ఫుటత్యర్థోఽస్మాదితి స్ఫోటః అను వ్యుత్పత్తిచే స్ఫోటయన శబ్దము. వాక్కు శబ్దము నాలుగు తెఱఁగులది. పర - పశ్యంతి - మధ్యమ - వైఖరి యని. అందు మూలాధారచక్రమునఁ గలవాయువునకు సంస్కారకము మూలాధారస్థము, శబ్దబ్రహ్మరూపము, స్పంద శూన్యము, బిందురూప మయినది 'పరావాక్కు.' నాభిపర్యంతము వచ్చిన వాయువుచే నభివ్యక్తమయిన మనస్సునకుగోచరించునది 'పశ్యంతీ వాక్కు.'

(సశేషము)

10. మఱియు నీసందర్భముననే

"అతను దళదిశావిజయకీర్త్యంకురముల
మీఁద మసపుగ వెలువడి మెఱయు నిత్తు
లతివ పదనఖములు వానియంతికమునఁ
జెఱవ శిక్షిన లతావిశేషంబు మేరు"

(౭. ౧౩౭. వా. బ ౧౪౧ ప్రౌ.)

ఇట "వెలువడి మెఱయునిత్తు. క. ఖ గ. మెఱయును. ఘ. వెలువడు మెఱుపులు. నా సవరణ" అని ఒత్తులో వ్రాయించిరి. "మసపుగ వెలువడు మెఱయు నిత్తు" అని మూలమందు దిద్దిరి. ఇట నీ దిద్దుపాటక్కఱ లేకయే పద్యార్థము సరిపడఁగలదు.

ఈ యువతియొక్క పైభాగమున కున్న పదనఖములు మదనుని విజయకీర్త్యంకురములపై భాగముననున్న ప్రకాశించు నిత్తులవలె నున్నవని యన్వయము. అంకురముల మూర్ధమున వ్రేళ్లును బీజభాగముల పోలిక గోళ్లును గలవని ఫలితము.

11. (౭. ౧౪౮ ప్రౌ.) పద్యమున మధురలాలస క్రీఁగంట శంభుని గాంచినపుడు ఆకన్నులు రెండును ఎఱుపెక్కు రతిస్మరుల యాందోళనములవలె నున్నవని వర్ణించు సందర్భమున వర్ణ్య మాపద్యమునందు లోపించి ముద్రితముల నున్నది. 'తృష్ణఁ బొలిచె' అన్నది ముద్రణ ప్రమాదము. 'కాల్కలు దలిర్చె' అని వ్రాఁత సర్వత్రపాఠములు. 'కాల్మలఁదలిర్చె' అని బహూరి ప్రతి. ఇందు 'దృష్టు' అను పాఠము 146 నంబరు గల తంజనగరప్రతిలో దొరకినది. 'కాల్కలఁదలిర్చె' అను పాఠము శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు చెప్పినదే. మఱియు నిందలి 'కడకళ్లు' అన్నచోట 'కడకట్లు' అని చిన్నయసూరి పాఠము. 'పట్టుపడాల' అన్నచోట 'పట్టునడాల' అనియు 'కాలుకలఁదలిర్చె' అనియు నేలూరుప్రతి పాఠము. వీనినుండి యుక్తతమగు పాఠము గ్రహింపఁబడినది. మఱియు నీపద్యమందలి 'అబ్బురపువంచెలు' అని ముద్రిత

ములలోని పాఠము (శ్రీ) వల్లాదివారు బరూనిప్రతినిబట్టి 'అంబరపుదండెలు' అని మార్చియున్నారు. దీని కర్థమేమో తెలియదు సరిగదా యీరాదిప్రాసపాటున యతి చెడినది కేయూరపాఠమును పేక్రిందఁ జిత్తులోఁ జేర్చిరి. ఈపదార్థము కష్టగ్రాహ్య మగుటచే దీనిభావము పెన్నఅలో వివరింపఁబడినది

(12) కళాపూర్ణుఁడు మధురలాలసపాట విని యాశ్చర్య మందిన సందర్భమున :—

"ఎవరికి సాల్లు దోఁచిన వహించెటగాని నిజాలు చెప్పకే
నేర మటంచుఁ బెట్టి ధరణీవర యింకను నీవు మత్సరో
దీకన నత్తిక్రో యిఁకను నీకుఁగఁ బల్కెడుమీఁద లేద......"

(౭. ౧౯౬. వా. అ, ప. ౧౯౭ పు. ౨౦౩ ప్ర.)

ఈపద్యమందలి 'నీవు' అనుపదమున కన్వయము లేదు. ముద్రితము లన్నిట నిట్లే యున్నది. కాఁబట్టి యట 'నీకు' చేర్చి వల్లాదిప్రతి 'నానవరణ' మన్నది.

"...ధరణీశ్వర యింక వినందు..." అని వేలూరిప్రాఁతప్రతిపాఠము. దీనినే నూతనముద్రితము గ్రహించినది కానఁ బైవరింపుకోఁ బని లేదు. మిగిలిన చిన్నమార్పులను నేలూరిప్రతి యందలివే.

(13) కళాపూర్ణుని జైత్రయాత్రాసందర్భమున :—

"ప్రోవఁ బాఁజులఁ బెట్టి తోఁపులతోఁ దవులతను
మొనల గల్పలచుచ రాజకులంబు"

అని పూర్వముద్రితప్రతులపాఠము.

"మొనలగలచుచు రాజకులంబు" ౮. ౩౦ వ ప్ర. అని వల్లాదివారిపాఠము. ఇట పీఠ "మొనల గల్వలచు, వ ఫ జ. 'గల్వరచు' క. గ సవరించితిని" అని చిత్తులో వ్రాసిరి. ఈయర్థసిద్ధికై 'గల్పలచు' 'గప్పలచు' గా నూతనప్రతి గ్రహించినది. ఇట 'మొనల వేప్పలచు' అని వేలూరిప్రాఁతప్రతి. ఇది యన్నిటికన్న మంచిపాఠము. ఇట 'సవరణ' అవసరము లేదు.

'నూతనపాఠము'లలో జూపినది. ఉదా:, సరస్వతీ, వావిళ్ళ ప్రతులం దాయాతావుల లక్షణవంతములుగా గానరావు. వానిని విస్తరభీతిని ప్రత్యేకముగా వివరింపక పద్యసంఖ్యలను మాత్ర మిచ్చుచున్నాను. చివరి నూతనపాఠములలో జూపి శ్రీశాస్త్రిగారి విడిచిన "సవరణలు" ఏయే ప్రతులయందు దొరకినవో పాఠకులు సులభముగ గ్రహింతురుగాక.

| ఆశ్వాసము. | వావిళ్లాదిప్రతిపద్యసంఖ్య. | నూతనప్రతిపద్యసంఖ్య. |
|---|---|---|
| 3 | 58 | 60 |
| 3 | 157 | 158 |
| 4 | 20 | 21 |
| 4 | 181 | 182 |
| 4 | 203 | 205 |
| 5 | 64 | 64 |
| 5 | 69 | 69 |
| 7 | 78 | 78 |
| 7 | 100 | 102 |

ఇట్లు శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు చేసిన 'సవరణ' లలో గొన్ని చేయనవసరము లేనివియు, గొన్ని ప్రతులలో నున్నవియు నైయున్నవి.

## యతిభంగములు.

మఱియు నీకళాపూర్ణోదయముద్రితప్రతులలో బెక్కుతావుల యతిభంగములు గానవచ్చుచున్నవి. వ్రాతప్రతులు గాంచుచో నీయతిభంగములు లేక శుద్ధరూపము లగు ఛందోభంగములుగూడ కనుపట్టుచు నుండుట. ప్రకృతము వాని నంటక వావిళ్ళవల్లాదివారిప్రతులందు గోచరించిన యతిభంగములను, వానికెదుట నూతనప్రతి గ్రహించిన సాధుపాఠములను జూపెదను.

(1) ప్ర. త్రైలోక్యస్తుత్యుల స్పందనల నరయుశోధన్యసోబా హ్వయ......, ౧. ౪౬ మల్లా. ప్రస్తరణ మూఁడు యతిస్థానములు. అందు మొదటిసంయుక్తాక్షరమున కేభాగము గ్రహింపఁబడి యతి నిలుపఁబడినదో చివరివఱకు నద్దానినే నిలుపవలె నని నియమము గలదు. పై పాదమున మూఁడవచోట జరుగదు. సరస్వతీవావిళ్లమల్లాది వారల ప్రతులలో యతి చెడి యున్నది "త్రైలోక్యస్తుత్యుల స్పంద నుల నరయుశోధన్య......" ౧. ౪౬ ప్రా. అని నూతనప్రతికి లభించిన పాఠము. ఇం దాదోషము తొలఁగినది.

(2) "పలుఁగు సేసికడిండివారువము దోలెత" 3. ౬౬ మ. ఇది గీతపాదము. మల్లాదివారిట "వారరము. క. గ. వాలవము ఖ." అని చిత్తులో వ్రాయించిరి. యతి పోయినసందర్భము గమనింపరైరి. ఇట.

"పలుఁగు సేసికడిండివార్వమ్ము దోలఁత" అని వావిళ్లసరస్వతి బరూరిప్రతులపాఠము. ఇందు యతి పోలేదు. ఈపాఠమే నూతనప్రతి గ్రహించినది. (చూ. 3 ౬౭ ప్రా.)

(3) "అనఁగఁ దనూలత ల్యౌయుఁ బరిగ్రహంబున కోర్వలేక వెం" అని మల్లాదివారిప్రతి. ఇది చంపకపాదము, శ్రీశాస్త్రిగారిట "పరిగ్రహం. క. ఫ. బ" అని చిత్తుగోఁ జూపిరి. ఇదియే సరియైనపాఠము. మరాళమున నున్నపాఠము యతి తప్పినది. ముద్రితము లన్నిటను మంచిపాఠమే గ్రహింపఁబడినది

"...అనఁగఁ దనూలత ల్యౌయు పరిగ్రహంబున కోర్వలేక..."
(3 ౭ ప్రా త్రప్రతి.)

(4) "పదతలర్వంబున నో తర్వాతర్వారమున లిచ్చో నెవ్వరున్ లేర" అని (3. ౧౫౭ మల్లాదిప్రతి) ముద్రితప్రతు లన్నిటను యతి తప్పిన పాఠమే యున్నది ఇది మత్తేభపాదము. పై పాదమున స్వరమైత్రి లేదు.

"సుదయు............ఇచ్చో నెవ్వరున్ లేరె, యూ" అని యే లూరిప్రతి. దీనినే నూతనప్రతి చేకొన్నది. (చూ. 3. ౧౫౮. ప్రా.)

(5) "నాకు మరుఁడు నిన్ను నేలు మనరా కునికిన్" అని 3. ౨౮3. మల్లాదిప్రతి నిట యతి తప్పినది. ఇది కందపద్యపాదము. ఇచట శ్రీ సూ. శా. గారు "నిలుపవమనన్ రా, వ. ఫ. బ, అని దిత్తులోఁ గూడ వ్రాసిరి. కాని యిట ముద్రితము లన్నిటను "నాకు మరుఁడు నిన్ను నిలు మనన్ రాకుఁ గికిన్" అను గ్రుద్దటపాఠ మున్నది. నూతన ముద్రణముకూడ నైపాఠమే గ్రహించినది. (చూ 3. ౨౮౫. శ్రీ.)

(6) "...నా,కు సఖిమతఁబె నీకుఁ దగ వన్నతలంపున..." అని వావిళ్లప్రతిపా. ఇట యతి తప్పినది. ఇది "నీపొందు నా కిష్టము కాదా? తప్పక సమ్మతమే" అని మణికంధరునితోఁ గలభాషిణి పలిందు సందర్భమున నున్నది. చంపకపాదము, కాఁబట్టి భావము చెడకుండ యతిని సవరించికొన్న తంజనగర ప్రతినుండి,

"నా, కసఖిమతంబె నీకుఁ దగ నన్న...,, అని నూతన ప్రతి గ్రహించినది. ( చూ ౪. ౧౮ శ్రీ. )

(7) "జృంభితతనో)వభావ వినఁబడ నంతన్,, (౫. ౫౭ మల్లా) మల్లాదివారిప్రతి గా నైచోట యతి పోయినది. ఇది కందపద్యపాదము. ఇతరముద్రితములఁ గూడ నీపాఠ మిట్లే యున్నది. ఏలూరిప్రతి యందిటుల:—

"జృభింతతద్రోవభావ చెవిఁ బడునంతన్" అని యున్నది. నూతనముద్రిత మీపాఠమునే గ్రహించి యతి సవరించికొన్నది. (చూ ౫. ౫౭ శ్రీ.)

(8) "అనఁగఁ దనమ్మాల పొట్టిదిరొ యనఁగ, (౫. ౫౯. అని వావిళ్లసరస్వతీప్రతుల పాఠము.) దీనిని మల్లాది వారిప్రతి

"అనఁగఁ దనమ్మాల సొంపుకుతిరొ యనఁగ,, (౫. ౬౮ మ. శ్రీ) అని సవరించినది. ఈపాఠము తిరుపతి వేలూరిప్రతులయందున్నదే. దీనినే నూతన ప్రతియు గ్రహించినది. ఇది సీసఖండము.

9, "తెలివిన్పుడాలుము త్రిపురుఁ జోకట్లఁ బెంపుఁగ నర్మసచివు తో సరస మాడు. గీ. ౧౧౩ వావి. అని వావిళ్ళబహారిపాఠములు. ఇది సీసపద్యపాదము దీని రెండవభాగమున యతి చెడినది

"పెం, పుఁగ నర్మసచివుతో సరస మాడు, అని సరస్వతీ ప్రతి పాఠము. ఇటుసర్వము చేయుట యతి సరిపడినది. మల్లాదివారిపాఠమును గూడ నిదే (చూ గీ. ౧౨౧ పు.) కొత్తప్రతియు పై పాఠమునే గ్రహించినది. (చూ గీ. ౧౨౧ కొ.) ఇట్లు సర్వము చేసుకొనుట సీకావ్యమునఁ బలుతావులఁ గలదు.

10. "ఉయ్యాల నిడి యూఁపుచోఁ గువలయాధిపు పాటలు..." ౬. ౧౯గీ. వావి. సరస్వతీపాఠములు స్వరమైత్రి లేక యున్నవి. ఇది యచ్యుత కృతి యనుకొన్నను సరిపడును. చంపకవృత్తపాద మిది.

"ఉయ్యాల నిడి... ...కువలయాధిపు పాటలు" అని నూతనప్రతి సవరించుకొన్నది. మల్లాదివారిప్రతిగూడ నిట్లే యున్నది. (చూ. ౬. ౧౯౬ గ్రం. ప్రతి)

11, గుజ్జనగూళ్ళ చ్చవగండ్లు పింపిళులు ఉచ్చెల్......" (౬. ౨౦౨. మల్లా.) ఇట స్వరమైత్రి లేమి యతి చెడినది. ముద్రణ ప్రమాదమని యనవచ్చును. బహారు సరస్వతీప్రతులు "గుజ్జనగూళ్ళ చ్చవగండ్లు... ...ఉచ్చిల్..." అని గ్రహించినవి ఇందును స్వరమైత్రి చెడినది. ఇది మత్తేభపాదము.

"గుజ్జెనగూళ్ళ చ్చనగండ్లు... ...ఉచ్చిల్..." ౬. ౨౦౨. అని వావిళ్ల పాఠము. ఈపాఠమే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౬. ౨౦౩ గ్రం.) ఇందు యతి సరిపడినది.

12. "అనద్యశోభూషణాన్విత విలాసవిచిత్రత నొప్పె..." పూర్వముద్రితములందును మల్లాదివారిప్రతియందును నీపద్యము యతి లేక యుట్లే యున్నది. ఇది చంపకపాదము. విలాసశబ్దమందలి సకారము యతి గుసది కాదు, కొందఱు దీనిని "ఋఘ్ యతి" యని యందురు గాని,

అని యొక్క "తలావ" శబ్దమును మార్చియే చెప్పను. ఇటఁగొన్నిప్రాఁత ప్రతులలో "అనవద్యశభూషణాసితశిలాదివిచిత్రత... ..." అనుపాఠ మున్నది. ఇట యతి సరిపడినది. అర్థపుష్టిమాత్రము లేదు. దీనికడ నేలూరిప్రతిలో,

"అనదురుభూషణాన్వితవిలాసవిచిత్రత... ..."

అని యతి సరిపడినపాఠ ము లభ్యమైనది. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౭. ౧౦౩ గ్రం.)

(13) "... ... పైనిడినయుం, బరపుదండెలువోలె బొమలు దనర" ౭. ౧౪౪ మ. ప్ర. ఇది సీసము. దీనిఖండమున మల్లాదివారి ప్రతిలో నీయతి లేనిపాఠ మున్నది. వీరు పేటకిరింద జత్తులో "అబ్బు రపు వ. ఫ. ఙ." అని యతితప్పనిపాఠము నుంచిరి. బహూరిప్రతియు నిట్లే గ్రహించినది,

"అ, బ్బురపుదండెలువోలె బొమలు దనర" అని వావిళ్ళవార వ్రాఁతప్రతులపాఠము. ఇందు యతి సరిపడినది. నూతనముద్రణ మీపాఠమే గ్రహించినది (చూ. ౭. ౧౪౭ గ్రం.)

(14) "కొంచ చంద్రుఁడు వడిమట వ్రాలఁజొచ్చె" ౮. ౨౩ అని బహూరువావిళ్ళప్రతులు. ఇది గీతపాదము. ఇందు యతిగాని ప్రాసయతిగాని లేదు. దీనికడ సరస్వతిప్రతి "కొంచ చంద్రుఁడు వడమటఁ జేరఁజొచ్చె" అని గ్రహించి ప్రాసయతిగా సవరించుకొన్నది.

"అంతకంత, కొలఁది జంద్రుండు వడమట వ్రాలఁజొచ్చె" ౮. ౨౪. అని యతితప్పనిపాఠ మేలూరిప్రతియం దున్నది. నూతనప్రతి యీపాఠమే గ్రహించినది. మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(15) "బిరుదావళులు వందిజనులు చదువ" ౮. ౩౧. మ. ప్ర. మల్లాదివారి యతిలేనిపాఠము గ్రహించిరి. మరియు వీరిటఁ జత్తులో "వందిజనులు వ. ఫ. ఙ." అని సర్దుబాటుపాఠము సత్రభాగాన మొనర్చి యతి తప్పినవానిని మూలమునఁ జేర్చిరి. మిగిలినముద్రితములందు "బిరు

దావపురులు వంశీవరులు చదువ" అని ప్రాచీనయతి గలపాఠ మున్నది. నూతనప్రతియు నీపాఠమునే గ్రహించినది (చూ. ప. ౩౧ గ్రం.)

(16) "బెదరుట లేక వైదుషతి సేయక పోరి..." ప. ౧౦౦. వా. ఈపాఠమున యతి పోయినది ఇది లేఖకకృతపాఠము. ముద్రితము లన్నిట నీపాఠ మిట్లే యున్నది.

"కన్, బెదరుట లేక వైదుషతి సేయక..." అని యేలూరిప్రతి పాఠము, ఇందు యతి సరిపడినది. నూతనప్రతియు నిద్దానినే గ్రహించినది. (చూ. ప. ౧౦౨ గ్రం.) మల్లాదివారిపాఠము నిదియే.

(17) "అద్వైతపరుల కసాధ్య మగుచు" (ప. ౨౨౦. వా.) పైరీతి యతిలేనిపాఠము వావిళ్లప్రతి గ్రహించినది. ఇది లేఖకపాఠము. "అద్వైతపరుల కప్రాప్య మగుచు" అని బరూరిసరస్వతీప్రతులు గ్రహించినవి. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ. ప ౨౨౮. గ్రం.) మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(18) "...సు వాగ్విదళాఖ్యపద్మాంబునందు. (ప. ౨౨౫. వా.) ముద్రితప్రతు లన్నిట నీరీతి యతిలేనిపాఠమే యున్నది.

"స, వాగ్విదళాఖ్యపద్మాంతరమున" (ప ౨౨౮ మల్లా.) అని మల్లాదివారిపాఠము, ఇల యతి సరిపడినది.

"...స, వాగ్విదళాబ్జమధ్యంబునందు" అని యేలూరిప్రతిపాఠము. ఈపాఠమును శుద్ధమ మగుటచే నూతనప్రతి దీనినే గ్రహించినది (చూ. ప. ౨౩౪. గ్రం.)

"శీలం గలభాషిణిని విడకే చనంగ," 3. ౧౩౨. గ్రం.

"శీలం గైదువు గిదు వేమియును లేకే యున్నాయి స్వత్రులకు" 3. ౧౨౭. గ్రం,

ఈపై పాదములలో నియతులం దొకచోట నవధారణార్థకస్వరము విరుగుచున్నది. రెండవకడ నఖండముగా నున్నది. ఇది యఖండయతు లని గొందరిమతము కాని యవధారణార్థకస్వరముతోఁ గలిసినట్లు

స్థలరంగమ్ములఁ గాముఁడన్నటకుఁ దొజ్జుఁగూడ నాడింపఁగా
లలనాపాత్రము లాకి రొప్ప రతిలీలాలాస్యలోలాస్యలై.

కా. సం. ౮ ౧౮౦.

అట్టివర్షానసమయంబున దంభోనాసిరియై గారి ఘోరరవంబు సేయునవసరంబున నంత నైన యూము జనెలపై గ్రొత్తనగు జాకనాములు దగిలి మిక్కిలి వన్నెమీరాలె, యూయూమాదేవి యాచరించుతపమునకు డెందము మెచ్చి దేవతలు కూర్మ్యములసేసలు కురిపించిన ట్లొప్పెనని.

క. అమర నెతిజదలపై ను
త్తమరుచినవజలకణములు దగిలి శెడంగై
యుమతపమున కెద మెచ్చి త
దమరులు కూర్మ్యములసేన లలికిఁ భంగిన్.

కా. సం. ౬ ౨౬౬.

శరత్సంవత్సరమున శరత్కాల మగ్గమైన జకములఁ బర్వెడు ఆశారదవేళ వికసించిన పద్మములనూ కలువలనూఁ గాంచుము, ఆవలకు జాముసఁ బవ్వళించిన హరియూరు లక్ష్మియురు వర్షరాత్రులతుదిని మేలుకొని కన్నులు విప్పి చూచుచున్నట్లొప్పెనని. హరి యరవిందాక్షుఁడు, ఇందిర యుత్పలాక్షియుఁ గాన నీయుత్ప్రేక్షయు నొప్పియున్నది.

క. జలశాయులైన హరిల
క్ష్ములు వర్షనిశావసానమున మేల్కాంచి క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలములు వెలసె శారదవేళన్.

కా. సం. ౬ ౨౭౦.

ఉ. దారుణశీతసీవిమలపాండురసుధాకర ధాతి రోదసీ
పూరితమై దినంబుల నభోమణిదీప్తిఁ దలంక కిమ్మగాఁ
జేం భువిభవించె నసఁ జెల్లగనె స్మరమేఘమాంసకం
తరుహాశశసంహతులు గ్రిక్కిటినె స్మరదాగమంబునన్.

కా. సం. ౬ ౨౭౩.

అని పేర్కొని అర్జునుఁ డింద్రకీలపర్వతము నెక్కువిప్రస్తావమునం దలి శరత్సమయవర్ణనమును దాను గొంతవఱ కనుకరించినాఁడు. ఈక్రింది పద్యమును గొలఁది మార్పులతోఁ గూడినది యట్టిదే.

ఉత్సాహ. అరుణశాలికణిశములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసి పాఱు దిగ్వధూచయం
బరయఁ జెలువ మెసఁగు శారదాగమమున నుత్సవో
త్కర విభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై.

కు. సం. ఉ. ౭౭౭.

దిక్కులనెడి స్త్రీలు అందముతోఁ దులతూగెడు నాశరత్సమయమున ఉత్సవములు పాటింపఁ దోరణములు కట్టినట్టులు చెలువ మెసఁగ శుకాళులు నోట నెఱ్ఱనైన వరివెన్నులు గఱచుకొని యాకసమున బారులుగట్టి పఱుగెత్తినవి. కిరాతార్జునీయములో నీభంగి యిట్లున్నది.

శ్లో. ముఖై రసౌ విద్రుమభఙ్గలోహితైః
శిఖాః పిశఙ్గీః కలమస్య బిభ్రతీ
శుకావలి ర్వ్యక్తశిరీషకోమలా
ధనుశ్శ్రియం గోత్రభిదోఽనుగచ్ఛతి.

సం. కిరా. ౪. ౩౬

వికసించిన దిరిసెనపువ్వువలె మృదువైన యాశుకాళి పగడపుఁ దునుకవలె నెఱ్ఱనైన ముఖములచే పచ్చనగు కలమాగ్రములఁ గఱచి కొనుచు నాకసమున నింద్రధనుశ్శోభ ననుకరించుచున్నది. ఆశుకాళి సూఁతగఁ గొనియే మన నన్నెచోడుఁడు తోరణములఁ గట్టించినాఁడు.

శరత్కాలము తన సూఁతునకు భరింపరాని తాపము గలిగించు చుండుట గాంచి హిమభూధరాధిపతి శరదృతువుపై దండు వెడలెనో యనునట్లు మంచు లెల్ల నెల్లెడల వ్యాపించెను.

క. శరదాగమంబు తనసుత
కురుపరితాపంబు సేయుచుండుట హిమభూ

ధరకతి గని వాణిశయిం
బరగొని యెనొ నాఁగఁ దుహినపటలము పర్వెన్.

కు. సం. ౬. ౭౮౦.

అట్టి హేమంతసమయమునఁ బద్మాకరలక్ష్మియు నణఁగి పోయెను. పోఁగా కొలను విత్తనమునకై తన కొక పుష్పమాలికయు దాఁచుకొనిన ట్లుదకమందుండి తప మాచరించుచున్న పార్వతి ముఖ మలరారెను. మఱియు మంచు వ్యాపించి పద్మము లన్నియు వాఁడిపోఁగాఁ గొలనులో నీరొక్కపువ్వే నిల్చినది; దీనికిఁ గూడఁ గీడు వాటిల్లునేమో యను భయముచేఁ దమ్మిద కన్నియు గుమిగూడి యడ్డు నిల్చెనోయనునట్టు లాయుమాదేవియొంటు తానసమునపై జడలగుంపు పెనవేసికొని యొప్పెను.

క. తసరి హేమంత మునఁ బద్మములు లడంగి
పోవఁ బోవుటఁ గొల నొక్కపుష్ప తనకు
విత్తుగా దాఁచుకొని యున్నవిధము పోలె
శైలసుతవదన ముదకవాసమున నొప్పె.

కు. సం. ౬. ౭౮౪.

చ. వనజము లెల్ల మంచుకొని వాడినచో నొకపుష్ప నిల్చె నా
గని యళులన్నియు న్మఱపుగా గొని దీనికిఁ దప్పదప్పునో
యనుకొని మీఁదఁ బొందుకొని యడ్డము నిల్చెనొ నాఁగ నంబుజా
ననము తెయిఁ జటావళి పెనంగి నగాత్మజ యొప్పె నత్తఱిన్.

కు. సం. ౬. ౭౮౫.

ఇట్లతిదుస్సహశీతోపేతంబు గు హేమంతశిశిరంబులందు నిరంత రోదకవాసనిరాహారాది ఘోరతపోవృత్తిం బ్రవర్తించు చుండునంత— అని హేమంతముతో పాటు శిశిరమును గూర్చి వాఁడేగాని ప్రత్యేకముగ వర్ణించియుండలేదు. అటులనే ప్రకరణాంతరమున వసంతమును విపులముగ వర్ణించియుండుటచే నీప్రకరణమున నావసంతశోభ నంతగఁ జిత్రించియుండలేదు. కాని వసంతమును వర్ణించినట్టున భావసామ్రా

పగిదిపూసీలజాలములు నా దనరారె వసంతవల్లభుం
డగువలరాజు కంచమణిహర్మ్యములో యనఁ జూగభూజముల్.

కు. సం. ౪ ౪౫౬.

చూతవృక్షముల నీవి వలరాజు వసించుటకు నిర్మింపఁబడిన యాయిదువిధములగు మణులచే ఖచితమైన మేడలవలెనని నొప్పారఁజేసినాడు. మొగ్గలు వజ్రములు, పూవులు, ముత్యములు, ఇంపైన యున్నని లేఁతచిగుళ్లు పద్మరాగములు, చిలుకలు పచ్చలు, తుమ్మెద లింద్రనీలములు. ఇట్లు వసంతవల్లభుఁడైన వలరాజు నివసింప సర్హమగు మణిఖచితహర్మ్యమై యొప్పెడినది.

మఱియు నీమామ్రము మొక్కటియే మనసిజునకు నయిదువిధములయిన యస్త్రముల సంపత్తిం జేకూర్చినది. అంకురములు చిగుళ్ళు మొగ్గలు పూవులు ఫలములు క్రమముగా నున్మాదన మదన మోహన సంతాపన వశీకరములను దనరారిన యస్త్రము లైనవి.

క. చన నున్మాదన మదన మో
హనసంతాపనవశీకరాస్త్రము లన హ్యా
జనుపకు నంకురపల్లవ
ఘనకోరకపుష్పఫలనికర మామ్రములన్.

కు. సం. ౪ ౪౫౬.

ఈసహకార భూరుహచక్రవర్తియే యొకపరి శంభుమూర్తిదాల్చి యీకావ్యమున విలసిల్లి మనోజుని ఉదరికడి రౌహాపరిల్లఁ జేసినాడు. మఱియు నీసహకారమే వసంతసంగీతి కశాలాంగిమై యొప్పి, పూవులను మందహాసములతో, మత్తిల్లి తుమ్మెదలమధురగానము తీయనిపాటలతో, రాచిల్కలపలుకులను ముద్దుమాటలతో, చిన్నగుజ్జలరాగమునిరాగములతో, కోకిల కుహూకార మధురమధుర నాదములతో, సెమలి పింఛములను కేశజాలములతో, రాలిన మకరందములను మొలకాలితో నొప్పి చూడఁదగిన విలాసము దాల్చెను.

ఈ విలాసవతి నిట్టి నూతనాలంకారములతో భూషించి ప్రదర్శింపఁజేసిన కవివతంసుని ప్రతిభ సుశ్లాఘ్యము. ఇట్టి వసంతము కవివతంసుల కావ్యములందెక్కడఁ గానరాదు.

చ. అలరుల మందహాసమున నన్నవపల్లవమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలను జెందలిరాకులరాగలీలఁ గో
కిలనినదంబులన్ బరిహాసకేళిభరంబున ముక్తవర్ణమే
ఖిల నభిరామమయ్యె సహకారలతాంగి మధుప్రసంగితిన్.

కు. సం. ౪. ౪౬౮.

ఇంతియ గాక యీ సహకారము వసంతసంగతిని వలరాజును బోలి యొప్పెను. చిగురుగొడుగుతో పుష్పబాణములో, బలిసిన కోకిలలు చిలుకలు తుమ్మెదలు అను పరివారముతోఁ గూడ నట్టి సామ్యమేర్పడినది.

క. తలిరుల్లిఁ బూవుటమ్ముల
బలిసిన పికకీరభృంగపరివారముతో
వలరాజుఁ బోలి మామిడి
నలఘుతగతి సురవసంతసంగతి నొప్పెన్.

కు. సం. ౪. ౪౬౯.

ఇఁక మలయపవనము తుమ్మెదలు చిలుకలు కోవిలలు గావించిన విలాసములు విహారములు కడు హృద్యములు. ఆప్రకరణమునందలి శైలి హృద్యతరము. భావము లన్ననో కడు మధురములు. విస్తరభీతిచే వదలినాఁడ.

కాని యీ మధుసమాగమున పోలుచు, ప్రమోదరసమునఁ గ్రాలుచు వనమును పాలనసేయు బాలికలు నవనవలాడుచు తీఁగ యుయ్యేలల నూఁగుచు క్రొత్తక్రొత్తపోకడల రాగాలాపములు చేసిరి. వారి పాటలతోఁ గలిసి పాడిన మధురగానము గావుననే నన్నెచోడుని వసంతము ప్రాక్తనమైనను నూతన మనిపింపకపోదు.

క. పోలుదు పద్మోదరపదమునఁ
గ్రాలుదు వనపాలబాలికలు నవలతికాం
దోలికల నెక్కి నలువుగ
వాలుదు లాగించేసి పాడి రతినవలీలన్.

కు. సం. ౪. ౪౬౭.

ఇంకను నీరీతిగ భావభరితములగు వర్ణన లెన్నియో గావించి యున్నాఁడు. ప్రసంగాంతరమున వాని నరసెదము గాక.

నిన్ను దర్శించినకతన నాప్రార్థించినయర్థంబును గృతార్థంబయ్యె నని
నిర్ణయించితిఁ దద్భంగి యవధరింపుము. ౧౬౮

క. సతి యనఁగ నన్మతాత్మజ
యతిశయగుణనామధా మహావనవాశా
పతి గల దానతి కోర్ధన
గతి మీ కర్పించుబుద్ధి గలిగితిని శివా! ౧౬౯

క. మత్ప్రార్థన మీయర్థము
సత్ప్రతిభాయత్త భక్తజనరక్షా శ
క్యత్ప్రాభవ యీశ్వర యే
తత్ప్రకటవరంబు నాకు దయసేయఁ దగున్. ౧౭౦

ఉ. నావిని యవ్విభుండు వచనంబునఁ గొండొక నవ్వు దేఱఁగా
నావనజాననాత్మజను కానతి యిచ్చె నితాంతమంగళ
శ్రీ విలసిల్ల నీతనయఁ జిత్తమునం జిగురొత్తు వేడ్కతో
నే వరియించెదన్ భవదభీప్సితసిద్ధి ఘటించునట్లుగన్. ౧౭౧

వ. అతియు నతిక్రమంబున సముత్సవంబకిమెకు; నూరడిల్లి మనుచుం బలికి యాతని వీడ్కొలిపి, తానును మరలి, రజతాచలంబున కరిగి, తగువారిచేతం బెండ్లిదినంబు దెల్పున కొలఁగించి పుచ్చి, సము చితంబుగా సమాల్యగంధమాల్య ప్రముఖద్రవ్యదివ్యభూషణంబుల వలన నలంకారం బలవరించి, సర్వసంయమిసుపర్వసహితుఁ డగుచుఁ దక్షిణాయంబునఁ జనుదెంచి సత్యంబుపశవవాక్యంబున నుభయ పార్శ్వంబుల విష్ణుద్రుద్రగణసహితుం డగుచు నిరంతరసేవాహేవా కరతపరిసన్నకాలరుద్రదేవుండు ముందటఁ గలసి కొలువ, భావా తిందిరాచండిక లప్సరసస్త్రీలుం దారుకుఁ బిఱుంద నిలిచి కల్యాణ గీతంబులతోడ మంగళాశీర్వాదంబు లప్పటప్పటి। శేఖరస్థలం బున నలుకఁ, దుంబురునారదప్రముఖ జయవర్ధననాదంబులుఁ ద్రివళి మృదంగకాహాళిపుష్పరాసనవద్యని నాదంబులఁ గలసి యొప్పుచున్నదిఁ

బదిరిక్కాలం జెప్పుచుకొలుక, మంచిమ ముహూర్తంబునం గదలి యన్యో ధుండు తద్బంధువ్రాతమంబు కదిసిన, బహుమానంబుగా నతు ర్కాని పూజించి. తయ్యన నివాసంబున కేగి, శాస్త్రమార్గంబున సగ్న్యుపాధ్యాయ ధుర్యాదులు సమర్పించి, యాతకమున్న సిరియింటి లోపలఁ బట్టె తెలుమాటున మంగళశృంగారగతిం జెలంగుచున్న సతి చేరువకుం జనియె; నాసమయంబున, ౧౭౨

సీ. లగ్న వేళ నైన లలితనై భవనోద్య
మసురవృంద్యవాద్యరతుల ప్రమోద
నడుమ నున్నవారి నదలించి దవ్వరల్
దిగిచి రింపు మతుల దీటుగొనఁగ. ౧౭౩

క. తెర వాయఁ దడవ నిగ్గలి
తెర చాయలలోచనము లిలియఁగఁ బ్రేమం
జరదారఁ గ్రోలఁ దొడఁగెను
హరిఁ జాదరణీయభావహావస్ఫురఁ దగన్. ౧౭౪

చ. హరిఁ దటమున్న మంగళమయాంజనసూత్రసమాత్ర మాదర
స్ఫురణ దృఢంబుగా మడిఁచె సుందరి యంతఁ దదీయభావభా
వరసరసోపాధిపీఠికల వారని వేద్య నిజాత్మ విధానముల్
గరముచుఁ బ్రుల్లచం జపుకలించుచుఁ జెంపున నోలలాడుచున్. ౧౭౫

వ. తదనంతరంబ యాభోగిత ప్రకారంబునఁ బాణిగ్రహణవిధానంబు సలిపి హోమంబు నిర్వర్తించునప్పుడు తోజ యగుచున్న కమలాననకుండు నతిదర్పకలాలసంబగు మానసంబున హోమాగ్నిలోపలఁ బద్ని సమిధలఁ బెట్టి ప్రకామంపుధూమంబు కల్పించి నిజచరితంబు శివున కెఱుకపడకుండఁ గ్రిందుచూపుల సర్వశ్వమాత సీక్షించుచుట్టెనెన.

ఉ. తన్నదిరాత్మవిభ్రమము దక్కక తన్నులఁ గ్రోలఁ జొచ్చెఁ బ్రే
మ స్మరు చేత చిట్టదరి మానస మాతలమయ్యె నట్లు గ

శ్వరుఁ రాణించిన వచ్చి యాతఁడున శబ్దార్థప్రభూతప్రభా
స్ఫురణం బాఁ బ్రవహించు తత్పదములం బూజించె జూటాటవిన్.

వ. తదనంతరంబు. ౧౮౨

క. అభయము శాశ్వత యీశ్వర
యభయము దివ్యప్రభావ యవ్యయ యభవా
యభయము సర్వజ్ఞ ! భవా !
యభయం బవినాశ యీశ యాశ్రితవరదా ! ౧౮౩

చ. అతిచపలత్వభావమున నాంగికవాచికభావికోగ్రదు
ష్కృతిమయుఁడైన వాఁడ నను జేయుము శుద్ధునిఁగాఁగ లోకగ
ర్హితుఁ డగుటంటుఁ గాచుటయు నెందుఁ గృపాళుతగాక కల్ల ల
క్షితములుగాఁగ దాని మఱియెవ్వరుఁ గావరు విశ్వనాయకా ! ౧౮౪

క. ఏనపు దవజ్ఞఁ జేసితి
మానసమున నంతవట్టు మఱువుము నీవే
గాని మఱి దిక్కు నాకుం
గానఁగనే నెందు నిజముగాఁగ మహేశా ! ౧౮౫

వ. అనుచు బహుభంగుల సంస్తుతించుచున్న యన్నలినాసనత్రోవ నోడకు మని యతని శుద్ధుం జేయుటకు గంగాముఖ్యపుణ్యతీర్థధరితంబుకు, వసుంధరాంగకలితంబును నగు నొక్కరమండలంబుఁ గృత చేసి, యాలఘుపద్మాదవిలాసుంగా నలవరించి, యశేషంబుగా రమణీయవేషంబు దీర్చి, యభినవవాళినయప్రశస్యంబులగు పద్మరోలాక్యంబు లాదరించి, యిట్లు నిజవివాహోత్సవంబునఁ ద్రిభువనంబులకుఁ బరితోషం బాచరించి, యుల్లసితవిలాసవతియగు పతిఁ గరాంగుళి నలవరించి సవ్యరత్నాభిరామ దివ్యవిమానాధిరోహణం బాచరించి, వల్లభాసంగవల్లవితకటాక్షనిరీక్షణాలోభూయమానవిభ్రమంబును, సురాంగనాకరచామరాకరసమీరణదోధూయమానకుంతలంబును, విశ్వావసు తుంబుర నారద ప్రభృతిగంధర్వగీతప్రబంధకేళియు

యాకాశతలమున నవయంబుఁ దిరుగుట
నడఁ పూని యించుక నిలువనోగా
వాంఛ ప్రకటించిపై వావిరిఁ బుట్టినఁ
జెలఁగి తత్సంగతి చేయనోగా
తిమిరారిగానఁ దదీయాగమాశంక
దొడరిన వెనఁ గ్రుంకఁ ద్రోవనోగా
గీ. యఖిలతనురాజి యుదరాష్ణ మాఁచికొనిన
నోర్వఁజాలమి భృగుపాత మొందనోగా
నాఁగ మందాయమానమండలముతోడ
నస్తగిరిమస్తకముమీఁది కరిగె నినుఁడు. ౧౯౨
చ. మఱిఁ దలకోకదంపతులమర్మములన్ వ్వదళించి పాంథతీ
కరముగ నెత్తిపట్టినఁ బ్రకాశము నొందెను నన్నలీల ని
ర్భరరుధిరాభిషేకపరిభాసితచక్రము వోలె నత్తతి
వ్వరుణునిదిక్కునందు దినవాయకమండల మొప్పె శోణమై. ౧౯౩
క. నునుఁజసిఁడిగుండు కేల
న్నసువిఁడివిజు శాఁదు మింట నార్జితమార్గం
బునవిగిడిపెట్టుపడి జవ
మునఁ దూలెడునట్లు ప్రొద్దు పాటునఁ గ్రుంకెన్. ౧౯౪
సీ. అలఘుకాలకృపాణహతి మాఁగుదినమహి
షము మేనిశోణితోచ్ఛ్రయ మనంగ
యామినీభామిని సరుదార మంగళి
తెలుఁగార నునుదోఁపు తెలుపనంగ
పాంథుల నేఁప నుద్భటలీలఁ దోఁచిన
మరునిప్రతాపాగ్నిమంట యనఁగ
[1] ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

---

1. వ్రాఁతప్రతిలో నిట కొంతపాఠము గానరాదు.

గీ. ధరణిహయఖురాగ్ర దళనోత్థితాస్త్రాద్రి
భాగచాయధాతుపటల మనఁగ
బరగి కెంపుచాయఁ బడమటిదిక్కున
వెలసె సాంధ్యరాగవిభవ మపుడు. ౧౯౧

క. ఇరుఁ డపు డురుతరుచి విధివశ
మునఁబోయిన యట్టిపిదపఁ బో నంగనలుం
జనుటయు తగ వని సంధ్యాం
గన యూరురుచి యనుకరించె ఘనరాగమునన్. ౧౯౨

సీ. విరహుల మర్మము ల్వ్రవిదళింపఁ గరపాన
వెలుఁచిన మరునస్త్రగుళికలయనఁగ
రాజు రాఁగలఁ డని రజని ముంగిట నిడ్డ
ముత్యాలసన్నమ్రుగ్గు మెఱుఁగడ లనఁగ
మినరము క్రమ్మై యుఱఁ జను నళ దాని
సలువ దాఁచిన వెండి మెఱుఁగు లనఁగ
కాలభైరవయోగి కంఠకీలితములై
మనరూపు నవశంఖమణు లనఁగ
దివిజనదిలోనఁ దిరిగెడు దిగ్గజములు
త్రుంచిమీఁటిన తెల్లనితొగ లనఁగ
తారరుచి మింట నంతటఁ దార యగుచుఁ
గరముఁ జెలువొందు చుక్కలు గలయఁబొడిచె. ౧౯౩

క. తారాస్మితేమజగ్రిన
వారధటీదరణి వచ్చిపట్టికరణిఁ జె
న్నారెం దమ్ముల మంచా
కారము లగుసంధకారకాకోఘంబుల్. ౧౯౪

గీ. శీతకరుఁడు నపుడు చీకటి మీఁదరాఁ
తలఁచి కనిచె దాడికాని కరణిఁ

బూర్వశిఖిఁ గళలఁ బొల్చి షోడశకళా
వనితఁ దోడఁగ నీరజాప్తి సేయు ౧౯౯

సీ. నీలవరోరుహాస్వీశమధ్యమదిశా
పతిరత్నకుడుపానచమర మనఁగ
ప్రాగన భితిలకవద్మ్మికఫాలము దిశా
రవిణిధావ్వదస్త్రీకముల మనఁగ
చూడామణిప్రభాభిశోభితం బగుదిశాం
గనకుంకుమారుణస్తన మనఁగ
హరినీలమణికందుకాంచితం బగుదిశా
యువతిపాణికలపల్లవ మనఁగ

గీ. పూర్వశిఖిఁ దోఁచెఁ బొఱపొందు గందు దో
రంపుఁగెంపు వాదు సొంపు మిగుల
విరతవమ్మదోత్కి విశ్వంభరామీఁద
మండలంబు చంద్రమండలంబు ౨౦౦

క. చంద్రజనితవ(మ)దనకళలన్
రజనీముఖము దగిలి చుంబనము సేయుచు నా
ద్విజరాజు రాగవశమున
జకరములు జపి కట్టె నెలి సంబరమున్. ౨౦౧

సీ. మొనమొగ్గరంబున మొనయుచీకట్లను
[1]కట్టఁబట్టి బట్టి మల్లాడియాడి
దండగాలు గవుండి తలిమి చీకట్లను
గ్రొవ్వఁజందా(నొవ్వఁ)గొట్టిగొట్టి
[2] (వెనవిరాజు)కళవున వెలయుచీకట్లత్రు
ళ్లఁగించి త్రుంచి తూటాడియాడి

1. తోఁబట్టమిట్టి.
2. కళవుర వెలయుచీకట్ల త్రుళ్లఁగించి
వెసఁద్రుంచి త్రుంచి తూటాడియాడి.

దన్నవ సల్లాంఛన మది
వెన్నెలకుం బాటి యగుచు విలసిల్లె నృపా ! ౨౦౩

వ. ఇట్లు చంద్రుం డలఘుప్రభాభాసమాన విభవ విస్తంద్రుం డగుచుండ, చంద్రికాసారంబు సారంబుగాఁ బ్రబలి యొప్పారుచు, తక్కరియునుంబోలె వెలితనలు చూపుచు, మొలకచన్నుఁగవయునుంబోలె నిట్టఱ్రోచుచు, విఱిగిన దళంబునుంబోలె పఱియుంబాఱుచు, తక్కెరకాఁడునుంబోలెఁ బథికు నొంచుచు, నిధిగన్న పేదయునుంబోలె గగనంబు ముట్టుచు, మఱియు బహుళంబుగాఁ జెలంగుచుండి, మిక్కిలి తెల్లంగలిగి వచ్చుచుం బోవుచుండియు, రాకపోకల కుఱికి రాజదాఁపున వృద్ధిపొందుచుండియు నేవంకనైనను బట్టుసాలక నంతనంతనం బరగి తమ్ములసిరి కోపుచుండియు, దిగ్వలయనముల్లాసంబు జరిపి బహులంబు మెఱసి వెలుఁగుచుండియు, రాత్రిగాని తఱి సూడ వెఱచి మెల్లజరులకుఁ బ్రియంబు సేయుచుండియు, మిత్రునిఁ బాడఁగని యుబ్బు దప్రసన్నత వదలి యవ్విధంబుగాక చక్రవాకంబులతోఁ గైరవానీకంబులు విప్పుచు, చంద్రకాంతంబులతోన కాముకస్వాంతంబులుం గరఁగను, చకోరంబులతోన సాగరపూరంబు బుబ్బను, తిమిరకదంబంబులతో సురతవిడంబంబులు వెడలను, తస్కరాటోపంబులతోన విరహిమనస్త్రాణంబులు గమలను, జారస్తోమంబులతోన విటవిటీప్రేమంబు పెరుగను, మఱియు మదనశృంగార మంత్రంబులకు వెసనిద్రము ద్వాదెల్సె, పంచమవాద్యశుంభత్ప్రణాద మస్తగిరియుంగణాసీను నగలించె; పూర్వదిక్తరుణదీప్తప్రభావాళపల్లవోల్లాసనంబదఁ బరిఢవించె. ౨౦౪

చ. సనకసనందనాదు లగుసన్మును లుల్లములం బ్రసన్నతా
ఘనత దలిర్ప శంకరునగారము ముందర నిల్చి భక్తితో
సనఘవిభాతకాలకృతనార్హనవార్థగభీరబద్ధతిన్
ఘనఘన కింపు సేయువచనంబులఁ బ్రస్తుతి చేసి రాశిప్రభన్. ౨౦౫

గీ. అతులమూర్తిలీల నామ్నాయమునులఁ బ్రబల
వాదు లగుచు సత్త్వ దర్శితోడఁ
బొగడె నంబికావిభుని భూతభావి
యాభిధానగుణమహత్త్వములను. ౨౦౮

గీ. ఇపుడు విచ్చేయు నీకుఁ బ్రాణేశుఁ డనుచు
బొసఁగ రవిరాక వెలిఁగింపఁ బోయినట్టి
దూతికయుఁబోలె సత్తెఁ దొగలనుండి
కదలెఁ నళిరాజి పద్మినిఁ గదిసి చెప్పె. ౨౦౯

సీ. కలువలఁ గొంగ జక్కవలకోర్కులపంట
నిండుచీకట్లకు గుండెబెదరు
చాతులపుట్టి ప్రాఁజనువుల నెలదుంప
బొంటి మచ్చలపాలి వెంటిగఁడియ
మహిమలకుల్ల నేమములు నిల్పఁగ నీడ
యిరునాల్గుమేనుల పెనుబకొండ[1]లు
తమ్ములచుట్టము ధరప్రమొక్కలకు నల్ల
త్రిమ్మరికత్తెల రొమ్ముమురియ
చెలివిసిరియల్లు ... తోనఁ దెరలు వెజ్జ
తపసులకుఁ బ్రోపు చుక్కలదాడికాఁడు
చలివెలుఁగుసూను మిన్నుల వెలుఁగువేల్పు
పొడుపుగుబ్బలిఁ జెన్నుగాఁ బొడిచె నిరుఁడు. ౨౧౦

క. హరునకు నశేషజగదీ
శ్వరునకుఁ బొడ సూప నదితమ సమయం బెంచున్
ద్వరఁ జనుదెంచెనో యనఁగాఁ
గర మొప్పెను మింట నహిమకరుఁ డట్టిమెఱసెన్. ౨౧౧

సీ. తొలి దొలి యించుక మెలచి యంగారికలతోఁ
బరిపాటి మోసులు పాఱిపాఱి

---

1. కొండలు.

తిలకించఁగా నంతటఁ దలకొని యేపునఁ
　　జాజుకట్టుచుఁ గొనసాగి సాగి
గవ్వటిల్లుచు నున్న మవ్వంపుకలిమిచే
　　కావ్యంబు నామది ప్రబ్బిప్రబ్బి
నల్లతావుల నల్లిబిల్లిగాఁ బ్రాఁకుచు
　　నొక్కయుమ్మడి బెగడొత్తిరొత్తి

గీ. వినుతవిశ్వజనులకన్నులపండువ
యగుచుఁ గ్రొత్తగాఁగ నలమి యలమి
యంత లతయుఁ బోలె నెంతయు రుచిమీఱ
కరము మీఱి చాయ కాయఁదొడఁగె. ౧౧౨

క. అంతట మున్న మహేశ్వరుఁ
డంతఃపురి వెడలి యుచిత మగుకరణీయం
బంతయును జరిపి బాహ్యస
భాంతరసింహాసనమున నాసీనుండై. ౧౧౩

క. తత్సమయాగతసకలదివి
షత్సంయమినాథు లాత్మసందర్శనసా
త్త్వోత్సవమగ్నులుగాఁ గడు
వాత్సల్యంబున నొసఁగె వారల కోర్కుల్. ౧౧౪

వ. ఇట్లు కొలువుండి యనంతరసమయంబునఁ బ్రమ్మటి యంతఃపురంబున కరిగి సర్వమంగళతోడి వినోదగోష్ఠిం దగిలి యభినవసురభిగంధబంధురం ధరచలదలపల్లవసంబు లగునుపవనంబులలోపలను వినిద్రకాచంద్రమణిశాలావాలనిర్మలజలపూరంబు లగువిహారకాననంబులకెలనను ఘనమత్కాంతనీలకంతయువతీసారకేకారవసుందరంబు లగు కుతుకాచలకందరంబులయందును, అతిస్వచ్ఛతీరచ్ఛవిపుష్పగుచ్ఛనిష్యందమకరందరసాస్వాదనవినోదచంచరీకమిథునమధురఝుణఝుణాలంకారంబు లగుఁగల్పలతాగారంబులయందును, మఱియును శీతారామవిశ్రామప్ర

కారంబు లగుతత్ప్రదేశంబుల నెఱుఁగుచోట్ల నిలిచి, చారుముఖ
యుం దాను నిచ్ఛావిహారంబులం జరించుచుఁ గ్రీడించు నాసమయం
బున, ౨౧౫

శా. వీచెం బూర్వదిశాగతశ్వసన మున్వీతెంచ ఛేకధ్వనుల్
పూచెం గందళకేతకీవటలము ల్వోపిల్లె దూర్వాలతల్
మోచెం గర్భము కుం బలాకలు మదంబుం దాల్చె మాతంగముల్
వేచెం బాంథులఁ బుష్పధన్వుఁడు గళావిస్ఫారసారంబుగన్. ౨౧౬

సీ. ఆకసంబున మహీశాటవీస్థలమునఁ
దనరుతమాలపాదపము లనఁగ
సంబుజంబునఁ బంకజాకరాంతరమునఁ
బ్రబలు మేచకతమోవలము లనఁగ
నంతరిక్షంబున నచలదేశంబున
మలయు మదాంధసామజ మనంగఁ
ద్రిదశమార్గంబున నుదధిమార్గంబునఁ
దిరుగునుద్దండ మకరము లనఁగ

గీ. నిరులు గొనుచు దిక్కులెల్ల దక్కవడ
దమరకుం బసంగ దట్టమగుచు
చేతి కందినట్టు చెప్పవింతగఁదోఁచ
నంబుగర్భమాలనాంబునములు. ౨౧౭

శా. జంబూవృక్షము లెల్ల నింద్రమణిభాస్వచ్ఛాయలం బర్వ భా
వంబుం దాల్చినయట్టికండ్లు కడుఁజెల్వం బందె నాకాశమా
ర్గం బుండం దమ కింపు (లేక) జలగర్భస్ఫారతం గల్గు మే
ఘంబుల్ భూమికి వచ్చి నిల్చెనొ నాఁగాదృక్పుపర్వంబులై. ౨౧౮

చ. ఘనతరమద్దవాదనపికస్వరకేకలముం ద్రికావ్యము
ఘనములు మారిఁబోయి శ్రుతివర్వి శేషము నావహించు ళో

ధగధగ త్తుల్లసిల్ల నరుణకర్కశకంధితరంగధామములం
దొసరె నభస్థలోద్ధతమయూరకిశోరకతాండవార్భటుల్. ౧౧౯

క. ఘనసమయమున మెఱుపుహారియ
ట్లున నెంతయుఁ జిత్రరుచులఁ గొమరొందెడు న
వ్యనతననవపుష్పదామక
మనస్త్రియఁ గనఁబట్టె సురశరాసన మంతన్. ౧౨౦

మ. తనరారంగ మహోర్ణ్వతాళ ముకుళం దానంత [1]వర్షాగమం
బున నింపారనివాలి యుచ్చి వెలికి న్బ్రాభాము పాలింగఁ జ
ల్లిన నీరాజనదీపసంతతులపోల్కి [2]న్నింద్రగోపంబుచా
ల్గనుపట్టెం దరుణప్రవాళశకలాకారానుకారంబులై. ౧౨౧

గీ. రాజహంసగతుల రాజమానసమున
వెదకఁ దక్క దివిని వెలయదయ్యె
రాజహంసగతుల రాజమానసమున
వెదకఁ దక్క దివిని వెలయదయ్యె. ౧౨౨

క. మెఱుఁగుంబణఁతుల నటన
రొంపులు ఘటియించిన ర్వా దురుమంజలతు
ల్నొప్పుగఁ జెలంగుచున్న
నెఱమములు విలసిల్లె ఘనఘనమొల్లానములై. ౧౨౩

క. తొలఁకులఁ దొడన జేగురు
లొలుకఁగ వడగండ్లు దొరఁగి రొప్పెను వర్షా
లలనమెడ హారముక్తా
ఫలములు మెడ యూడి నేలఁ బర్విన కరణిన్. ౧౨౪

వ. ఇట్లు క్రమంబుగ వెలసిన ఘననాఘనకాలంబున నానంవ త్తరత్న
ఉన్, ౧౨౫

1. వర్షాగమం. 2. పోల్కిఁ జిడగోపాల,

మ. [1]………………గంధూపితస్వచ్ఛవా
శ్చటరించుం దగఁ బుష్కరంబున యదృచ్ఛానల్పకీలల్పకో
త్కటదానంబు లొసర్చుఁ దుండమున నాశాంతవ్రజస్వామి న
త్కటకక్షోణులయందు నాత్మపతికిం గాఢూహలాయామధుండై ౧౨౬

క. తార్చుముఖస్థలిఁ బను న
ల్లార్చును నిజకరము దృఢతరాయత్తముగాఁ
జార్చును దన్మదగంధముఁ
గూర్చు భ్రమరములఁ గాంతఁ గులపతిమీఁదన్. ౧౨౭

ఉ. పారదచంచరీకబకచక్రకహంసకులావతంసకా
సారదమీరభూములఁ జొనంగ రమించు సపీనగంధమం
దారసమూహగుచ్ఛసుమనఃసపూర్ణమదప్రవాహి మం
దారసమీరము ల్పొలయ నాప్రియుఁ గూడె మనోజలీలలన్. ౧౨౮

వ. మఱియుం జొక్కు తెఱంగులం గలుగు విహారణంబులం దగిలి కొలంగు గమిన్మిథునంబులం జూచి శంకరుండు సతీవదనంబు సప్రహంబుగా నిరీక్షించుసమయంబున. ౧౨౯

మ. సతి గాంచెం బ్రతిశుద్ధవర్ణకనకచ్ఛాయాచ్ఛటాభాసురో
ద్గతపాశాంకుశమోదకాభయకరాగ్రశ్రీసముల్లాసు స
న్నతదంతాగ్రశోభమానఘనశుండాలక్షణీయున్ సునో
ద్యతకాయుం జగదేకరక్షణమహత్త్వాంబు హేరంబునిన్. ౧౩౦

శా. ప్రాచీముఖ్యదిశప్రసన్నతరశోభ న్గాంచె నవ్యార్కుల
న్నోచిప్పేశుఁడు ప్రజ్వలించె హృదయత్త్వం దద్యశాహ్లాదనా
వైచిత్రిం బ్రసరించె నంతయు శివస్వస్మండలం బుల్లస
ద్రోచిర్లక్ష్మి వహించె నీశ్వరికిఁ బుత్రుం డట్లు జన్మించినన్. ౧౩౧

వ. తదనంతరంబ వారు అక్కడం గదలి రజతగిరికి విచ్చేయుచోఁ; దట్టొక,

---

1. ఈపద్యము మొదటిపాదము వ్రాఁతప్రతిలో గానరాదు. మఱియునిక్కడ గ్రంథపాత మున్నట్టు తోఁచెడిని.

గీ. ఆకరీంద్రవదనుఁ డతిరమ్య బాల్యవి
హారలోలహృదయుఁ డగుచు నపుడు
శంకరునకు దక్షనందనకును జాల
నింపు సొంపు నావహింపఁ జేసె. ౨౩౩

చ. పతి దను నంకపీఠికఁ బొనంగఁగఁ జేరిచి ముద్దులాడుచో
నతిమహితాద్భుతంబు లగునాయుమచన్నుల కార్మకుంభముల్
ప్రతియిడి వీని వాని గురుభావము చెప్పు మటంచు ముగ్ధతా
న్వితి నడుగు న్మహేశ్వరుని వీనులకు న్ముద మావహిల్లఁగన్. ౨౩౪

చ. జనకుఁడు తన్ను నూరుతలసంగతుఁ జేసి యథోచితోక్తలా
లనముల నింపు సేయఁగఁ జెలంగుచుఁ దత్పదనమ్రశక్రలో
చననికరంబు చూచి జలజాతసరోవర మంచు దొండ మెం
య్యన జరిగించుఁ దల్లిహృదయంబునకుం బ్రియముల్ జనింపఁగన్.

వ. మఱియు ననేకవిధంబులం దనరు నీదృశచరితంబులు దిలకించు నింపా
రుచు మూరుం జూచి, విశ్వనాయకుం డతని జగద్రక్షణ సౌభాగ్యభాగ్య
లక్షణంబులకుఁ దగినట్టుగా నొక్కపుణ్యదివసంబున హరివిరించిపూ
ర్వసురసర్వజనానాదంబులును, దక్షక్రతుముఖ్యసంయమిస్వస్తినాద
నాదంబులును, తుంబురునారదప్రముఖమంగళగానంబులును, రం
భామేనకాద్యప్సరోఽంగనా లలితాంగహారసంధానంబులు నుల్లసిల్ల
విఘ్నాధయాహార్త్రవు గమ్మురుచుఁ బట్టబంధనవిలాసముఖుం జేసిన నా
కరీంద్రముఖుండును సమస్తజగంబులకు సుపాసనీయుండగుచు వెలుఁగ
గుచును నిరతిశయభావందంబున దొందంబు చిగురొత్త నఖిలమతవిహం
ణవరుం డగుచుండె. ౨౩౬

క. అవిరళగతి గణనాథో
ద్భవ మనఁగా నిట్లు చెప్పఁబడుభవలీలం
దవిలి కథించిన విని
వివిధసుఖము లొంది విఘ్నవితతుల డిందున్. ౨౩౭

వ. అని చెప్పి మఱియు. ౧౩౮

శా. శంపావల్లివికల్లికాధరరుచిభాస్వత్తీక్ష్ణధారామహా
ఝంపాపాతనవిభ్రమభ్రమణశశ్వల్లబ్ధ నానాస్థలీ
సంపాతస్ఫుటగర్వసర్వఫలతాసంభిన్నమూర్ఛీభవ
ల్లంపాకాంగ కళింగవంగశకచోళద్రావిళక్ష్మాధిపా. ౧౩౯

క. కాంతవసంతమహోద్భవ
కాంతిపరీయుక్తకటకకరహాటవరా
క్రాంత నితాంతలసన్నుత
నాంత సితస్మితమనోహరాననకమలా. ౧౪౦

చామరము.

ఆహార్యధైర్యభూషణా దయారసార్ద్రభాషణా
మహాప్రతాపభాస్కరా రమాహటద్యశస్కరా
మహీసురామనోర్జితా సమస్తదోషవర్జితా
యహీనభోగజృంభితా సమగ్రధర్మగుంభితా. ౧౪౧

గద్య :- శ్రీమదష్టభాషాకవితాప్రవీణ బుధజనస్తుత్య
నిశ్శంక కొమ్మనామాత్య ప్రణీతంబైన
శివలీలావిలాసంబునందు
ప్రథమాశ్వాసము.

---